★ వేదాంతవ్యాస రత్నావళి ★ వేదాంతవ్యాస రత్నావళి ★ వేదాంతవ్యాస రత్నావళి ★

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణేనమః

# వేదాంతవ్యాస రత్నావళి

## ద్వితీయ భాగము



రచన :

**వెంపటి లక్ష్మీనారాయణ శాస్త్రి**

★ వేదాంతవ్యాస రత్నావళి ★ వేదాంతవ్యాస రత్నావళి ★ వేదాంతవ్యాస రత్నావళి ★

# సదభిప్రాయములు

ఓం శ్రీ మాత్రేనమః

"ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ" అన్నాడు గీతాచార్యుడైన శ్రీకృష్ణపరమాత్మ. ఆర్తి జిజ్ఞాస వున్నవారికొరకై వ్యాస, వాల్మీకి, పతంజలి, కణాద భరతాది మహర్షులు తపించి, విభిన్న విషయాలను పరిశోధించి అనేక వేదాంత రహస్యాలను లోకాలకు శాశ్వతంగా అందించారు.

కథ అనగానే పిల్లలు పెద్దలు అందరూ చెవులు రిక్కిస్తారు. అవి కేవలం కాకమ్మ కథలు కాకూడదుకదా! అవి మనలో జిజ్ఞాసను అవగాహనను పెంచి, చక్కని శీలసంపదను మనకందించేలా వుండాలి. ఆ వరవడి చిన్నతనంనుండే మొదలు కావాలి.

"వృద్ధత్వం ద్వివిధం"అని కాళిదాస మహాకవి అన్నట్లు జ్ఞానవృద్ధత్వం వైపుకి నడిపించాలి. అంటే ఆధ్యాత్మిక వాస్తవాలను గ్రహించాలి. ఉదాత్త జీవిత లక్ష్యాల వైపు నడిపించాలి అనే ఉదారభావనతో శ్రీ వెంపటి లక్ష్మీనారాయణశాస్త్రి గురువర్యులు ఎంతగానో చేసిన కృషికి అద్దం పడుతున్నది ఈ వేదాంత వ్యాస రత్నావళి ద్వితీయ భాగం.

ధర్మం అంటే ఏమిటి? ఎందుకు ధర్మం ఆచరించాలి? దాని ఫలితం ఏమిటి? ధర్మమో, అధర్మమో అందరూ సుఖదుఃఖాలు అనుభవిస్తూనే వున్నారుకదా! అనే ప్రశ్నలకు చిన్న చిన్న ఉదాహరణలతో చక్కని సమాధానాలు పొందుపరిచారు. ఎటువంటి పుస్తకాలు చదవాలి? దాని ఫలితం ఎలా వుంటుంది? ఎటువంటి ఆనందం, చిత్తశుద్ధి కలుగుతుందో చక్కగా చెప్పారు. వేద మంత్రాల నుండి బెణుకు మంత్రాల వరకు సూక్ష్మంలో మోక్షమన్నట్లు సులభంగా తెలియజెప్పారు. ఆచరణలేని శ్రవణము వ్యర్థము కాదని హెచ్చరించారు.

అత్యుత్తమ మానవజన్మనెత్తికూడా ప్రకృతి విరుద్ధ కర్మలకు తెలివిని దుర్వినియోగం చేస్తున్నారని ఆవేదన చెందారు. కేవలం ఆవేదన వలన ఫలితం ఏమున్నదనీ, ముందు తరాలకు ముఖ్యంగా విద్యార్థులకు మంచి సూచనలు చెయ్యాలి అనే "గురు" భావనతో అనేక విషయాలను సోదాహరణంగా పొందుపరిచారు. ఈ వేదాంత వ్యాసరత్నావళి ఏ కాలానికీ పాతపడని, మూల్యం తక్కువ ఫలితం ఎక్కువ అన్నట్లున్న చక్కని వేదాంత పరిజ్ఞానం కల చిన్న పొత్తం.

ఆధ్యాత్మిక చింతన కలవారిని ఆలోచింపజేసే మంచి పుస్తకాన్ని అందించిన శ్రీ లక్ష్మీనారాయణ శాస్త్రిగారికి కృతజ్ఞతా ప్రణామములు. శ్రీ మాత సేవలో....

*24-6-2001*

*విజయవాడ.*

**శ్రీమతి చెవుటూరి కుసుమకుమారి**

ఇందుగల పదకొండు వ్యాసాలు చదివి సంతసించాను. వీనిలో కొన్ని సామాన్యుల సందేహాలకు సమాధానముగ వున్నవి. మరికొన్ని క్రొత్త విషయాలను తెలియజేయుచున్నవి. అంతంలేని వేదాంతం అనే వ్యాసం అంతుపట్టని విషయాన్ని అతి సులభంగా తెలియజేయుచున్నది. మొదట ఈ వాక్యానికి అర్థమేమిటియనే సందేహాన్ని కలిగిస్తుంది. చదివితే విషయం స్పష్టమయినపుడు సంతోషం కలుగుతుంది. మన వేద శాస్త్రాలన్నీ పరబ్రహ్మ తత్త్వాన్ని గురించే బోధిస్తాయి. ఆ శాస్త్ర చర్చలు సామాన్యులకు అందుబాటు లోనికి రావు. అయితే ఆ విషయాన్ని శ్రీ శాస్త్రిగారు ప్రశ్న సమాధానాల రూపంలో సులభంగా తెలియజెప్పారు. వారికి నా కృతజ్ఞతలు.

*24-6-2001*
విజయవాడ.

– విశ్వనాథ రాజేశ్వరి

---

## నా యభిప్రాయము

మహర్షులు సమాజ క్షేమానికి ఎన్నియో మహత్కార్యములయిన పనులు చేసారుగదా. వాటిని మనము తెలుసుకొని సంతసించు చున్నాముగదా మరి. మనము వారి పనులు ఎందులకు చేయగూడదు.

వారు చాలా శక్తిమంతులు. అందులకని చేయగలిగారు. మనము అల్పులము అని కొందరు అంటారు. అది నిజమేకావచ్చు. వారు చేసినంత మనము చేయనక్కరలేదు. మనకు చేతనయినంత చేయవచ్చును. ఆ చేయుట కేవలము సమాజ క్షేమము కోసమేయని భావించరాదు. మన జీవిత పరమార్థము కోసముగూడయని భావించాలి.

ఆ భావనతోనే ఇతరులకు ఇబ్బంది కలుగని రీతిలో మన జాతీయ భావములను గురించి చిన్న చిన్న గ్రంథముల ద్వారా అందరికి అంద జేయుటకు శ్రీ జానకీ సేవా సమాజము ప్రయత్నించుచున్నది. మా ప్రయ త్నమునకు సహకారము అందించుచున్న శ్రీయుతులు నోరి శ్రీనివాసశాస్త్రి, శ్రీమతి కుసుమకుమారి, శ్రీమతి డి. ఇందుమతీదేవి, శ్రీ బయన శివరామకృష్ణ ఆర్య, శ్రీ బి. సుబ్బన్నశాస్త్రి, శ్రీ విశ్వనాథ పావనిశాస్త్రి, శ్రీ కె.కె. గుప్త మొదలగువారందరికి కృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

**– రచయిత**

# వేదాంత వ్యాస రత్నావళి

## ద్వితీయ భాగము

### 1. అంతం లేని వేదాంతం

వేదాంతం అనగా ఉపనిషత్తుల సారాంశం. ఆ సారాంశం నిర్గుణ పరబ్రహ్మం. అది అంతం లేనిది. ఆది మధ్యాంత రహితం.

మహర్షులు యోగులు, యతీశ్వరులు ఈ సృష్టికి కారణమయిన సత్యవస్తువును గుర్తించి దానికి సచ్చిదానందమని నిర్గుణమని నిర్వికారమని కూటస్థుడని సాక్షియని దృక్ అనిపేర్లు పెట్టారు.

మనకు సృష్టియంతయు కనిపించుచున్నది. భూమి, సూర్యుడు, చంద్రుడు, గ్రహములు, నక్షత్రములు, సముద్రములు కనిపించుచున్నవి. సమస్త జీవుల నిలకడకు ఆధారభూతమయినది భూమి. భూమిపై నివసించు ప్రాణికోటికి అహారమందించుటకు కారణమయినది నీరు. ఆ నీరు మేఘములవలన లభించుచున్నది. ఆ మేఘములకు నీరు అందజేయునది సముద్రము. ఆ సముద్రపు నీటిని మేఘములుగ జేయునది సూర్యుడు. ఈ విధముగ సృష్టి క్రమమంతయు జరుగుచుండగా దీనికి కారణమయిన సత్యవస్తువు ఒకటి యున్నది అని పరిశీలించవలసిన అవసరమేమియున్నది అని సామాన్యులకుగల సందేహము.

ఈ కనిపించేవాని వలన జీవసృష్టి జరిగి జీవించుచున్నప్పటికిని ఈ కనిపించేవన్నీ జడములు, చైతన్యరహితములు. జడములకు స్వయం ప్రవృత్తి కలుగదు. బండి జడము. ఎద్దులు కడితే ఎంత బరువయినా మోస్తుంది.

తనంతట తాను కదలలేదు. అందువలన జడమయిన వస్తువులను కదలించు టకు చైతన్య వస్తువు ప్రేరణ యవసరమయినది. అందుకని ఆ జడబస్తువులను కదిలించు శక్తి యేమిటియని మీమాంస బయలుదేరినది. ఈ వస్తువులన్నియు జడములని ఎటుల చెప్పగలము. వీనియందు చైతన్యము లేదనుటకు ప్రమాణమేమియను ప్రశ్న వచ్చును.

మనము చైతన్యముగల కొన్ని వస్తువులను చూచుచున్నాము. అవి మొదట చిన్నవిగనుండును. క్రమముగ పెరిగి పెద్దవియగును. తరువాత జీర్ణమయి నశించును. మొదట మొక్క చిన్నదిగ నుండును. తరువాత పెరిగి పెరిగి మహావృక్షమగును. కొంతకాలము బలిష్ఠముగ నుండును. పిమ్మట జీర్ణమయి నశించును.

ఆ విధముగ జీవికకు ఆధారభూతములన తగిన భూమి సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు మొదలగునవి. సంచరించుచున్నవేగాని పెరుగుట తరుగుట లేకపోవుటచే జడములు అన తగియున్నవి. అయినప్పటికిని ఇవి క్రమపద్ధతిలో సంచరించుటచేత వీటికి ఆధారభూతమయిన మరియొక కారణ వస్తువును గుర్తించవలసి యున్నది. ఆ వస్తువు వీనికి ఆధారమయి వీనికంటె విలక్షణమయి యుండవలయును. ఎందువలననగా అదియు ఇటువంటిదే యయినచో అదియు జడమగును. కావున చైతన్యముగలది కావలయును. చైతన్యమున్నను మనము చూచుచున్న చెట్టు పుట్టలవలె పుట్టుట పెరుగుట యున్నచో అదియు నశించి తీరును. కావున పుట్టుట పెరుగుట నశించుట యను ధర్మములు మారుటయను వికారము సుఖదుఃఖాదులగు స్వభావములు లేనిదిగ యుండవలయును. అందువలననే దానికి సచ్చిదానంద స్వరూపమని పేరుపెట్టిరి. సత్ అనగా ఎల్లప్పుడు నిలచునది యని భావము. అది శాశ్వతముగా నిలచిననేగాని దానిచే ప్రేరణ పొందు వస్తువులు నిలువలేవు. చిత్ అనగా స్వయం ప్రేరణ కలది. దాని ప్రేరణచేతనే అన్నియు కదులును గాన అది స్వయం ప్రేరణ కలది యని చెప్పవలయును. అటుల చెప్పక దానికి సుఖదుఃఖములు ఉన్నవియనినచో అది వికారముగలది యగును.

అనగా మార్పు చెందును. మార్పు చెందునది నశించి తీరును. అందువలన శాశ్వతత్త్వము ఉండవలయునన్నచో వికారము ఉండరాదు. ఈ విధముగ చెప్పి యా వస్తువును నిర్గుణ పరబ్రహ్మమని ఉపనిషత్తులు వర్ణించియున్నవి.

బాగానే యున్నది. ఈ నిర్గుణ పరబ్రహ్మను అంగీకరించుటవలన సామాన్య జీవులకు కలుగు ప్రయోజనమేమియున్నది అనునది విచారణీయాంశము.

సామాన్య మానవులు ఎల్లప్పుడు సుఖదుఃఖములకు లోనగుచుందురు. ఈ సుఖదుఖములు కలుగుటకు కారణమేమి? సామాన్య జీవులందరు ఒకేరకమయిన చైతన్యమును కలిగియున్నప్పటికిని ఒకరి పోలికలు మరియొకరికి ఆకారములోగాని కంఠధ్వనిలోగాని వర్చస్సులోగాని జ్ఞానములోగాని యుండుట లేదు. దానికి కారణమేమని యాలోచించిన జ్ఞానులు దానికి వారి కర్మఫలములే కారణమని చెప్పిరి. అనగా జీవులు జన్మజన్మలనుండి చేసిన మంచి చెడులు కారణముగ యిట్టి వికారములు కలుగుచున్నవని చెప్పిరి. ఆ పుణ్య పాప కర్మలనుగురించి పరిశోధించి వివిధములయిన వేలకొలది పుణ్యపాపకర్మలు కలవని నిశ్చయించి వాటి స్వభావములు తెలుపుటకై అనేక ధర్మశాస్త్ర గ్రంథములు రచించిరి. ఈ కర్మల ఫల స్వరూపములను వారు ఈ మార్గములో నిశ్చయించిరి. మూగవాడు పూర్వజన్మలో యితరులను తిట్టియుండును. వాడు మరల అట్టి పాపమును చేయకూడదనినచో వాడికి ఈ జన్మలో మాట యుండరాదు. అందువలన వాడు మూగియయ్యెను. లోకములో రాజు దుష్టుని శిక్షించు విషయమునగూడ ఎవడు ఏ అవయవముచేత ఏ యింద్రియముచేత తప్పు చేయునో వాడికి ఆ అవయవము ఆ ఇంద్రియము లేనిచో తప్పు చేయడని తలచి శిక్ష వేయుదురు. ఉదాహరణకు దొంగకు చేతి వ్రేళ్ళు తొలగింతురు. అందువలన వాడు దొంగతనము చేయలేడు. కాలివ్రేళ్ళు తొలగింతురు. అందువలన గోడలను ఎక్కలేడు. అదేవిధముగ దోషమునకు తగిన శిక్ష వేయుదురు. అటులనే ధర్మశాస్త్ర కర్తలు పాపముల కారణమున కష్టములువచ్చునని చెప్పిరి.

అటులనే పుణ్య కర్మల ఫలితములనుగూడ పరిశోధన చేసి ఏ పుణ్య కర్మవలన ఏ ఫలితము గలుగునో యనుదానిని గూడ వివరముగ చెప్పిరి. ధనము దానము చేసినచో ఐశ్వర్యము కలుగును. విద్యను దానము చేసినచో చదువు వచ్చును. ఈ విధముగ చెప్పి చివరకు పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమని చెప్పిరి. మహర్షులు ఈ విషయములను తమ బుద్ధి బలముచేగాక వేద ప్రమాణముతో చెప్పిరి యని గ్రహించవలయును.

ఈ విధముగ జీవులు చేసిన పుణ్య పాపములచే సుఖదుఃఖములు కలుగుచుండగ జీవులకు పరబ్రహ్మను అంగీకరించుట వలన ఏమి ప్రయోజనము అను ప్రశ్న వచ్చును.

ఇచ్చట వివరించతగిన విషయము.

ఆ బ్రహ్మ నిర్వికారుడయినను ఆయన దగ్గర ఐంద్రజాలకునివలె మాయ యను శక్తియున్నది. దానిచే ఈ సృష్టిని జరిపించెను. ఆ శక్తి సృష్టిని క్రమ బద్ధము చేయుటకై దేవతలను మానవులను పుణ్యపాపములను సృష్టించెను. దానిచే సృష్టించబడిన మానవులు వివిధ శక్తులుగలవారు. వారు మాయచే లభించిన శక్తిని మాత్రమే కలిగియుందురు. ఎటులననగా మానవులు నాలుకతో మాత్రమే మాట్లాడగలరు. చెవులతో మాత్రమే విందురు. అటులనే బ్రహ్మ సృష్టించును. విష్ణువు రక్షించును. శివుడు లయింపజేయును. ఇంద్రుడు వర్షించును. యముడు శిక్షించును. ఈ విధముగ దేవతల కర్తవ్యములున్నవి.

మానవులు తమ కష్టసుఖములననుసరించి యాలోచించి వివిధము లయిన దేవతలవలన తమ కష్టములను తొలగించుకొని సుఖములను పొందుచున్నారు. ఈ విషయములనుగూర్చి ధర్మశాస్త్రములు ఎన్నియో మార్గములను తెల్పినవి. ఈ కర్మకాండతో నిర్గుణ పరబ్రహ్మకు ఎట్టి ప్రమేయములేదు. అయితే ఆయనవలన మనకు ప్రయోజనమేమి. మాయా శక్తిచే కలిగిన సుఖదుఃఖములు ఎప్పుడును నిత్యములుగావు కారణమేమన ఆ మాయాశక్తియే యనిత్యము. అనిత్యమువలన పుట్టిన వస్తువు నిత్యము గాదు. అందువలన మనకు సుఖదుఃఖములు తొలగవలయుననిచో

నిత్యవస్తువును ఆశ్రయించవలయును. ఆ నిత్యవస్తువు నిర్గుణ పరబ్రహ్మము. దానిని ఆశ్రయించినచో సుఖదుఃఖములు లేని సచ్చిదానంద స్వరూపము లభించును. ఆ విషయమును వేదాంత శాస్త్రములు చెప్పుచున్నవి. ఈ సృష్టియంతయు సచ్చిదానందమగులచే మనము అంతము లేని వేదాంతమును అనగా నిర్గుణ పరబ్రహ్మానుగూర్చి ఉపాసించవలయును. అందువలననే వ్యాసులవారు దేవీభాగవతమునందలి ప్రార్ధనా శ్లోకమున సర్వచైతన్య రూపాంతాం ఆద్యాం విద్యాంచ ధీమహిధియో యోనః ప్రచోదయాత్ సర్వసృష్టి ప్రేరకమయిన చిత్స్వరూపమును ప్రార్థించిరి.

## 2. సృష్టిరహస్యమును విప్పిచెప్పిన మహర్షి

ప్రాచీన కాలమునుండియు సృష్టికి మనుష్యనకుగల సంబంధమును గురించి పరిశోధనలు జరుగుచనే యున్నవి. ఈ పరిశోధనలు సమాజ క్షేమమునకై మాత్రమే జరుపబడినవి. అందుచేతనే ఆ పరిశోధనలు చేసినవారిని మహర్షులు అను పేరుతో భారతీయులు ఎంతో గౌరవాదరము లతో చెప్పుకొనుచున్నారు. ఆ మహర్షులు తాము ఆ జీవితాంతము సలిపిన పరిశోధనల ఫలితములను తాము అనుభవించుటయేగాక వాటిని వాఙ్మయ రూపములో గ్రంథస్థము చేసి సమాజమునకు అందజేసిరి. అందుచేతనే సమాజము వారికి ఋణపడి యున్నది. దానికే ఋషిఋణము అనిపేరు.

ఈ పరిశోధనలు చేసిన మహర్షులందరు ఒకే విషయమునుగూర్చి గాక ఎవరికి వారు వేరు వేరు విషయములను గురించి పరిశోధనలు చేసిరి. పతంజలి మహర్షి మానవునియందుగల దేహశక్తులను వెలికితీయుటకై యోగశాస్త్రమును రచించెను. దానివలన మానవశరీరమునందుగల అద్భుత శక్తులు బయటపడినవి. అటులనే ఆ మహర్షి వైద్యశాస్త్రము రచించి శరీరమునకు జరుగు రోగ కారణములు వాని నివారణోపాయములను తెలియ జేసెను. జైమిని మహర్షి మానవుడు చేయతగిన సత్కర్మలను గురించియు

వాటి ఫలితములను గురించియు వివరణ చేసెను. కణాద మహర్షి ప్రకృతి యందలి పదార్థములను గురించియు వాటి స్వభావమును గురించియు వివరించి న్యాయశాస్త్రమును రచించెను. భరత మహర్షి నాట్యశాస్త్రమును రచించెను వాత్స్యాయనుడు కామశాస్త్ర విశేషములను తెలియజెప్పెను. అటులనే గ్రహములను గురించియు వాటి ఫలితములను గురించియు గుణములను గురించియు వివరించిరి. దానికి జ్యోతిషశాస్త్రమని పేరు. ఈ విధముగా మహర్షులు ఎన్నో విషయములను గురించి పరిశోధనలు చేసిరి. వాటి ఫలితములను ఈనాటికిని సమాజము అనుభవించుచునే యున్నది.

అయితే పైన చెప్పిన మహర్షులందరు తమకు అభిమతమైన ఒకటి రెండు శాస్త్ర పరిశోధనలను సమాజమునకు అందజేయగా వ్యాసమహర్షి సమస్త విషయములను పురాణముల రూపమున సమాజమునకు అంద జేసెను. వ్యాసపూర్ణిమ సందర్భముగ (9–7–98) ఈ వ్యాసము అందజేయ బడుచున్నది.

వ్యాసమహర్షి శక్తి సామర్థ్యములను తెలుసుకొనుటకు ప్రయత్నించుట ఆకాశమునకు అంచును వెదకుటయే యగును. అయన అనంతమయిన శక్తిగలవాడు. నాలుగు లక్షల శ్లోక పరిమితమయిన పదునెనిమిది పురాణము లను రచించెను. మనకు జీవితములో చదువుటకు సాధ్యమగునా యని సందేహము కలుగుచుండగ ఇన్నిటిని ఒకే వ్యక్తి రచించుట సాధ్యమగునాయని పరిశోధకులు ప్రశ్నించుచున్నారు. అందులకై వారు ఇది ఒకనాడు ఒక వ్యక్తి రచించినవి కావు వేరు వేరు కాలములలో వేరు వేరు ఋషులు వ్యాస నామముతో లిఖించి యుండవచ్చును అని భావించుచున్నారు. ఇది వారు తమ శక్తిని తాము అంచనా వేసుకొని మహర్షులశక్తిని యూహించుటయేగాని వారి వాదన సత్యవాదనకాదు. ఎందులకనగా. వారు శ్లోక పరిమితినిబట్టి ఊహాలు చేయుచున్నారేగాని అందలి విషయములనుబట్టి కాదు. విషయములనుబట్టి పరిశీలించినచో ఆ మహర్షుల శక్తి యనంతము అని తెలియును. అప్పుడు అనంతశక్తి గల మహర్షులకు ఇన్ని శ్లోకములు రచించుట

సాధ్యమేయని తెలియును. అప్పుడు నవీన పరిశోధకుల వాదన మటుమాయ మగును.

ఏమిటి విషయములందలి గొప్పతనము అని విచారించవలయును. పురాణములయందు సృష్టిలోని వివిధ కాలములయందు జరిగిన విషయములు చెప్పబడినవి. ఇందలి విషయములకుగల కాల వ్యత్యాసము ఒక శతాబ్దము కాదు. లక్షల కొలది సంవత్సరముల వ్యత్యాసముగలదు. ఒకరు కొన్ని లక్షల సంవత్సరముల వ్యత్యాసము గల విషయములను కథారూపమున ఎట్లు చెప్పగలడు. మన పరిశోధకులు వేయి సంవత్సరముల వ్యత్యాసముగల చారిత్రక కథలను స్పష్టముగ చెప్పుటకు అసమర్థులై ఎవరి వాదమునకు వారు తగిన విధముగ వారు కాలభేదము చూపుచున్నారు. అట్టివారు లక్షల కొలది కాల వ్యత్యాసముగల కథలను పరిశోధన చేయుట అసంగతము.

అయితే వ్యాసమహర్షి వేరువేరు కాలములలో జరిగిన కథలను పురాణ రూపమున సమాజమునకు అందజేసెను అని అంగీకరించినను దానివలన సమాజమునకు కలుగు క్షేమమెంత అని ప్రస్తుతము విచారించవలయును.

పురాణములయందు వందలాది చరిత్రలు గలవు. అవియన్నియు వేరువేరు స్వభావముగల వారి చరిత్రలు. అందువలన వానిని చదివినప్పుడు మనకు తెలియకుండగనే మన జీవితమునకు పోలిన చరిత్ర లుండును. మన జీవితమునగల సమస్యలకు పరిష్కారములను మనము వెదకుచుండగ మనకు ఆ కథలలో పరిష్కారము దొరకును.

పూర్వకాలమున ప్రతి దేవాలయమునందును సాయంకాల సమయమున పురాణ కాలక్షేపములు జరుగుచుండెను. అందువలన ఆనాటి వారికి జీవితమున కష్టనష్టములు కలిగినప్పుడు వాటిని ధైర్యముతో ఎదుర్కొనెడి మానసిక శక్తి యుండెడిది. అది ఈనాడు లేకపోవుటవలన సామాన్యులు అన్ని సుఖ సౌకర్యములుండియు ఏదియు లేనివారివలె బాధపడుచున్నారు. కొందరు బాధలను ఓర్చుకొనలేక హత్యలు చేయుచు ఆత్మహత్యలు

చేసుకొనుచున్నారు. కాబట్టి మన మానసిక శాంతి నిమిత్తము మన సమస్యల పరిష్కార నిమిత్తము పురాణములు చదువవలసి యున్నది.

పురాణములు జరిగినవా లేక కట్టుకథలా యను ప్రశ్నయున్నది. విశ్వాసముగలవారు జరిగినవియనియే తలచుచున్నారు. జరిగినా జరుగక పోయినా మనకు మార్గదర్శనములు అయినప్పుడు చదువుటలో దోషము లేదుకదా!

వీటిని వ్రాసిన వారిని వ్యాస మహర్షియని చెప్పుచున్నారు. వ్యాస మహర్షి శరీరావయవముల సౌందర్యము మనకు తెలియకపోయినప్పటికిని ఆయన వచనములయందలి తియ్యదనము మాత్రము మనకు తెలియుచున్నది. ఆయన సంస్కృత భాషలో వ్రాసెను. సంస్కృతమునకు అమరభాషయని దేవభాషయని పేరు. ఇది దేవతల భాషయగుటచే ఆపేరు వచ్చినది. ఆయన ఆ భాషయందలి అమృత స్వభావమును మనకు శ్లోకముల ద్వారా తెలియజేసెను.

వ్యాస మహర్షి కథాసందర్భముగ అనేకములయిన శ్లోకములను అనేకములయిన ఛందస్సులతో అనేక రీతులలో వ్రాసెను. అతి తేలికయయిన పదములతో పసిబాలుర మాటలవలె అమృతము చిందునట్లు వ్రాసెను. దీర్ఘ సమాసములు వాడినప్పటికిని తేలికగానే యుండును. అవి చదివిన వారికి మాత్రమే ఆ రుచి తెలియును.

భాగవతమును అమృత ద్రవ సంయుతము అని చెప్పుదురు. అందలి ఒక చిన్న కథ ద్వారా వ్యాసులవారి శ్లోకములయందలి అమృత స్వభావమును మన జీవిత సమస్యల పరిష్కార స్వభావమును వివరింతును.

భాగవతమునందలి చిన్న కథ అందరికి తెలిసినదియే. అయినప్పటికిని భార్యాభర్తల మధ్య భేదభావము కలిగినప్పుడు వారి సంభాషణ ప్రేమ భావముతో నిండిన సరస వచనములతో ఎటులుండవలయునో వ్యాస మహర్షి అందముగా వివరించెను.

దక్ష ప్రజాపతి యాగము చేయుచుండెను. పరమేశ్వరునకు ఆహ్వానము లేదు. అయినప్పటికిని సతీదేవి వెళ్ళదలచెను. పరమేశ్వరుడు నివారించ దలచెను. ఆ సమయమున సతీదేవి పరమేశ్వరుడు లోకాధిపతులయినప్పటికి ఆ యహంకారమును విడిచి సామాన్య జీవులవలె సరస సంభాషణ సాగించిరి. ఆ సంభాషణలో గర్వము అహంకారము లేవు. పరస్పర ప్రేమ పాశము మాత్రమే నిండియున్నది. వ్యాసమహర్షి వ్రాసిన శ్లోకములన్నియు వ్రాసి అందలి సౌందర్యమును వివరించుట సాధ్యముగాదు. అయినప్పటికిని విషయము తెలుపుటకు ఒకటి రెండు శ్లోకములు వివరించెదను. సందర్భానుసారముగ వ్యాసమహర్షి వృత్తమును మార్చి అందమయిన వృత్తములో వ్రాసెను.

దక్షుని యాగము చూచుటకు దేవతలందరు తమ భార్యలతో గలసి విమానములపై వెళ్ళుచుండిరి. ఆ దృశ్యమును చూచిన సతీదేవి పరమ శివునితో యిటుల అనెను.

నా సోదరీమణులందరు తమ భర్తలతో గలసి వెళ్ళుచున్నారు. నాకును మీతోగలసి వెళ్ళవలయునని యున్నది. అచ్చటికి మా బంధువులందరు వత్తురు. నాకు చాలా కాలమునుండి మా తల్లిని చూడవలయునని యున్నది. ఓ పరమేశ్వరా నీకు ప్రపంచములో ఆశ్చర్యమును కలిగించునది ఏదియులేదు. కాని నేను మాత్రము –

తథాప్యహం యోషిత్ అతత్త్వవిచ్చతే దీనా దిదృక్షా భవమే భవక్షితం – స్త్రీని. అందువలన నీ యధార్థశక్తి తెలియదు. దీనురాలనై వేడుచున్నాను. ఇచ్చట సతీదేవి సహజముగ స్త్రీలు భర్తను అనునయించు విధమున ప్రార్థించినది.

పిలువని పేరంటమునకు పోవుట తగునా యందురేమో!

**అనాహుతా అభ్యభియాంతి సౌహృదంభర్తుర్గురోర్దేహ కృతశ్చకేతనం**

భర్త యింటికి గురువు యింటికి పుట్టింటికి పిలువకయే వెళ్ళవచ్చును. నా యాచన మన్నించుము. యాచన చేయువారు ఎంతటి వినమ్రులై యుందురో అంతటి దైన్యభావముతో యాచించెను.

ఆ మాటలు వినిన పరమశివుడు తన ప్రేమను ఒలకపోయుచు ఇట్లనెను.

**త్వయోదితంశోభన మేవ శోభనే**

**అనాహుతా అప్యభియాంతి బంధుషు.**

ఓ సుందరీ నీవు చెప్పినది చక్కగ యున్నది. అని ఓదార్చుచు- వారు దేహాభిమానులైయున్నారు.

**విద్యాతపోవిత్తవపుర్వయః కులైఃసతాంగుణైఃషడ్భిర సత్తమే తరైః**

విద్య తపము వయస్సు శరీరములు మంచివారికి సద్గుణములు కాని ఇతరులకు కావు. అట్టివారు నిన్ను వంకర దృష్టితో చూచెదరు. వారి మాటలు బాణములవలె శరీరమును బాధించును. నీవు నీ తండ్రికి మిక్కిలి ప్రియమయినదానివి. అయినప్పటికిని నా కారణమున నిన్ను ద్వేషించును. నీవు నా మాట వినక వెళ్ళినచో

**యది వ్రజష్యసి అతిహాయమద్వచో భద్రంచ వత్యానతతో భవిష్యతి.**

**సంభావితస్య స్వజనాత్పరాభవో యదా ససద్యోమరణాయ కల్పతే.**

నీకు శుభము కలుగదు. గౌరవముగలవారికి తన బంధువుల యవమానము మరణము కల్గించును.

ఇందలి మాటల ఔచిత్యమును విశదముగా వివరించవలసియున్నది. పరమశివుడు సతీదేవి మాటలకు కోపగించక ఆమె మాటలను గౌరవించుచునే తన యభిప్రాయమును చెప్పెను. ఇది సరస సంభాషణ. వ్యాస మహర్షి తన పలుకులలో అందజేసిన దాంపత్య రహస్యము.

వ్యాసుడు కథలతోపాటు జీవన పరమార్థమును మానవుని కర్తవ్యమును తెలియజేసెను. చిన్న వివరణ. విజయవాడయందు మల్లాది రామకృష్ణ చయనులు అను మహానుభావుడు నివసించి యుండెను. ఆయన కుమారుడు వీర రాఘవ సోమయాజులు అను అవధూత స్వరూపుడు. ఆయన ద్వాదశ దీర్ఘసత్రయాగము చేసెను. ఆ సమయమున పదునెనిమిది పురాణములను

ప్రవచించెను. పురాణములయందలి నూరు శ్లోకములను ఎన్నికచేసి ముద్రణగావించెను. వారు ప్రకటించిన వానిలోని రెండు మూడు శ్లోకములతో ఈ వ్యాసమును ముగింతును.

**సోపాన భూతం మోక్షస్య మానుషం ప్రాప్య దుర్లభమ్**
**యస్తారయతినాత్మానం తస్మా త్పాపత రోఽత్రకః**

మోక్షమును పొందుటకు శరీరము మెట్లవంటిది. దానిని సంపాదించియు జ్ఞానమును పొందలేని వానికంటెను పాపాత్ముడు లేడు.

**ధర్మాచ్చ జాయతేహ్యర్థో ధర్మాత్కామోఽపి జాయతే**
**ధర్మ ఏవాపవర్గాయ తస్మాద్ధర్మం సమాచరేత్**

ధర్మాచరణమువలన ధనము ధనమువలన భోగము లభించును. ఆ ధర్మమువలననే మోక్షముసిద్ధించును. కావున ధర్మమును ఆచరించవలయును.

**అస్థిరేణ శరీరేణ స్థిరం కర్మ సమాచరేత్**
**స్వహస్తేన తతో దేయం మృతే కః కస్యదాస్యతి**

అస్థిరమయిన శరీరముతో స్థిరమయిన కర్మ చేయవలయును. అందులకై తానే స్వయముగా దానము చేయవలయును. చనిపోయిన తరువాత ఎవరు ఎవరికి యివ్వగలరు.

**విష్ణుర్మాతా పితావిష్ణుః విష్ణుః స్వజనబాంధవాః**
**యేషామేవస్థిరా బుద్ధిః న తేషాం దుర్గతి ర్భవేత్**

విష్ణునే తల్లియనియు తండ్రియనియు బంధువు అనియు తలచినవానికి దుర్గతి కలుగదు.

వ్యాసమహర్షి ఎన్నియో రహస్య విషయములను చెప్పెను. వ్యాసవాణి సముద్రము వంటిది. వెదకిన కొలది రత్నములు దొరకుచునేయుండును. అది వారివారి అదృష్టముపై ఆసక్తిపై ఆధారపడి యున్నది.

# ౩. సమాజ పరిశోధన ఫలితమే పురాణ వాఙ్మయము

మహర్షులు సమాజమును తగినరీతిని తీర్చిదిద్దుటకు ఆయా కాలములయందు జరిగిన వృత్తాంతములను పరిశోధనచేసి కావ్యరీతిలో పురాణ వాఙ్మయమును సమకూర్చిరి. ఈ పురాణములను రచించినవారు త్రికాలజ్ఞులయిన మహర్షులు. వారు అతీంద్రియ శక్తిచే భూత భవిష్యద్వర్తమాన కాలములను గుర్తించినవారు. వారు మానవ సమాజము సుఖశాంతులతో వర్ధిల్లుటకు ధర్మశాస్త్ర గ్రంథములను రచించిరి. ఆ గ్రంథములయందు సర్వమానవుల ప్రవృత్తిని గుర్తించి మానవులకు చేయతగినవి చేయరానివిగూడ తెలియజెప్పిరి. అయితే యవి ధర్మనిష్ఠులయిన సత్పురుషులకేగాని సామాన్య మానవులకు అందుబాటులోనికి రావని గుర్తించిన వాల్మీకి వ్యాసాదులు రామాయణ భారతాదులు రచించిరి. ఈ పురాణములయందు సమస్త మానవుల స్వభావములు తెలుపు కథలు గలవు. వాటిని చదివినవారు, వినినవారుగూడ తమ జీవనములను సుఖమయములుగా చేసుకొనుచుండుట చేతనే యానాటినుండి ఈనాటివరకు పురాణ పారాయణ కార్యక్రమము జరుగుచునేయున్నది.

పురాణశబ్దమునకు పురాతనమయినది అయినను నవీనమువలె అలరారుచుండునని యర్థము విజ్ఞులు చెప్పుచున్నారు. ఈ పురాణములన్నియు సంస్కృత భాషలో వ్రాయబడియున్నవి. సంస్కృతము మహత్తరమయిన దేవభాష. ఆ భాషయందుగల మాధుర్యమునంతయు వ్యాస వాల్మీకులు తమ గ్రంథములయందు రంగరించి పోసిరి అందువలన పురాణములను విను సమయమున ఆనందమును పొందలేని మానవుడు వుండడు. వానిని ఎన్ని పర్యాయములు వినినను చదివినను ఆనందము కలుగునే కాని విసుగుదల కనిపించదు. అందుచేతనే ఆ గ్రంథములను భారతీయులు వేలకొలది సంవత్సరములనుండి పారాయణ చేయుచున్నారు.

హైదరాబాదు నగరమునందు శ్రీ సుందర చైతన్యస్వామి రామాయణము

చెప్పుచుండగ లక్షలకొలది జనులు వచ్చి వినిరి. అటులనే శ్రీ త్రిదండి చిన నారాయణ జియ్యరుస్వామివారి యుపన్యాసములు శ్రీ మాతాజీ శివచైతన్య గారి యుపన్యాసములు అందరిని సంతసింపజేయుచున్నవి. సంతసించిన వారందరు వారికి ఘనసత్కారములను చేయుచునే యున్నారు.

అవి కేవలము తాత్కాలికమయిన ఆనందమును కలుగచేయటమేగాక వినినవారందరి జీవితములను సుఖశాంతులతో వర్ధిల్ల చేయుచున్నవి.

ప్రస్తుతకాలమున అధిక సంఖ్యాకులు పురాణములను చెప్పుటలేదు. అందులకు కారణము సమాజము వారిని సరిగా గుర్తించి ఆదరించలేక పోవుచున్నది. దానివలన సమాజమున అనైతిక స్థితి యేర్పడినది. దీనిని తొలగించుటకు ప్రతి గ్రామమున పురాణ ప్రవచన జరుగవలయును. అందులకు అందరూ సహకరించవలయును.

ప్రజల యనైతిక స్థితికి భయపడుచున్న ప్రభుత్వమువారుకూడా ప్రతి దేవాలయమునందును పురాణ ప్రవచనమునకు ఏర్పాటు చేయవలయును. ప్రవచనానంతరము ప్రసాద వినియోగము జరుగవలయును. కొందరు మొదట ప్రసాదమునందలి తీపితో వచ్చినను తరువాత పురాణ రహస్యములను తెలుసుకొని వినుటకు ఆసక్తి చూపుదురు.

మానవ స్వభావములను పరిశోధన చేసి వ్రాసినవి యగుటచేతనే పురాణములు ఇంతకాలము నిలచియున్నవి. పురాణములను వినినయట్లు ఏ యితర గ్రంథమును చెప్పినను వేలకొలది మంది జనము వచ్చి వినలేరు. ఎంత మంచి గ్రంథమునయినను ఒకటి రెండు సార్లు చదువుదురేగాని పది పర్యాయముల సుందరకాండవలె పారాయణము చేయలేరు.

ఈ పురాణ గ్రంథములను వినినంత మాత్రముననే పాపపరిహారము జరుగునని మహర్షులు చెప్పిరి. అందులకు కారణము, పురాణములన్నియు సృష్టికి కారణమయిన భగవంతుని మహిమను గూర్చియే చెప్పును. నామ స్మరణమే తరుణోపాయమనియు, త్యాగరాజ రామదాస మీరాబాయిలాంటి వారు నామస్మరణచేతనే తరించిరనియు మనకు తెలియును.

కొందరు పురాణములను పుక్కిటి పురాణములని తెలిసియో తెలియకయో చెప్పుచుందురు. దాని యదార్థ వివరణము యిటులయున్నది. ఆనాటి ప్రజలు పురాణ రహస్యములను కంఠస్థము చేసి యందలి విషయములను ప్రతిచోట గ్రంథము లేకయే తమ నోటి మాటలతో చెప్పెడి వారు. పుక్కిలి యనగా నోరు. మనము నీటిని పుక్కిలించి ఉమ్మి వేయ వలయును అనుచుందుముగదా. అందుచే వాటికి పుక్కిలి పురాణములు అని పేరు వచ్చినది.

పురాణములు మానసిక శాంతిని కలిగించునను విషయమును తెలియచేయు ఈ సంఘటనను చెప్పి ఈ వ్యాసమును ముగింతును.

పాండవులు వనవాసము చేయుచుండిరి. ఆ సమయమున వారిని చూచుటకు నారద మహర్షి వచ్చెను. ధర్మరాజు నారదుని సత్కరించి తమకు కలిగిన కష్టములను చెప్పుచు, మావలె రాజకుమారులైపుట్టి యింతటి వనవాస దుఃఖమును అనుభవించినవారు ఎవరయినా యుందురా అని బాధతోననెను.

అందులకు నారద మహర్షి ఓ ధర్మరాజా నీ కష్టము ఏమంత కష్టమయినది రాముని వనవాస వృత్తాంతము వినియుండలేదా? రాముడు నీవలె వనవాసము చేయుటయేగాక భార్యనుకూడ పోగొట్టుకొనెను. నీకు నలుగురు తమ్ములు సహాయులుగా నున్నారు. రామునికి లక్ష్మణుని సహాయము తప్ప మరియెవరి సహాయము లేదు. మీరందరు భార్యతోను తమ్ములతోను కలసి ఒకరి కష్టసుఖములను మరియొకరు పంచుకొనుచు జీవించుచున్నారు. పాపము రామునికి ఈ మాత్రము సుఖముగూడ దక్కలేదు గదా యనెను.

అది విని ధర్మరాజు నిజమే మేము వనమునందున్నను అందరము కలిసియే జీవించుచున్నాము. ఈ మాత్రము సుఖమును మాకు కలుగజేసిన భగవంతుని దయకు సంతసించుచున్నాము అని తన దుఃఖమును మరచి సంతోషమును పొందెను.

కావున పురాణములు ఎంత మానసిక పరిశోధనల ఫలితములో విచారించి తెలుసుకొనవలయును.

# 4. ఆనాటి మంత్రములు ఈనాడు ఫలించునా?

ప్రాచీన కాలమునందలి మహర్షులు సమాజక్షేమమునకై వారు తపో బలముచే గ్రహించిన కొన్ని మంత్రములను సమాజమునకు అప్పగించిరి. ఇంతవరకు ఆ మంత్రములను అనుసరించియే భారతీయులందరు తమ నిత్య కార్యక్రమములను నిర్వహించుచున్నారు. అయితే ఆనాడు చెప్పిన మంత్రములు ఈనాడు ఫలించునా?యని పాశ్చాత్య విజ్ఞాన కారణమున సంకుచిత మనస్కులయిన కొందరు సందేహించుచున్నారు కాని అవి ఫలించియే తీరును. ఫలించుచున్నవి. అందులకనియే ఇప్పటికిని అందరు మంత్ర జపములు చేయుచున్నారు. అయితే అవి ఎటుల ఫలించును. ఎటుల చేయవలయునను విషయములు జాగ్రత్తగా పరిశీలించవలయును.

ఏనాటివాడు సూర్యుడు. అయినను ప్రకాశించుచున్నాడు. ఏనాటిదో ఈ భూమి. అయినను చక్కని యాహారమిచ్చి అందరిని బ్రతికించుచున్నది. అటులనే మంత్రములు ప్రాచీనములయినను వాటి శక్తి తగ్గదు.

మంత్రములు రెండు విధములు. ఒకటి వేదోత్పన్నములు. రెండు మహర్షులు వేద మంత్రములయందలి రహస్యములను గ్రహించి అక్షర సంయోగముచే కూర్చినవి. ఇవి రెండును శక్తివంతములే. మహర్షులు వేదమంత్రముల యందలి భావమును గ్రహించి వాటిని వివిధ కర్మలకు ఉపయోగించునట్లు చేసిరి. వారిని సూత్రకారులందురు. సామాన్యముగా ఆ మంత్రములను వివిధ సత్కర్మలయందు ఉపయోగింతురు. వాటిని నవగ్రహాది దోష పరిహారములకు వినియోగింతురు. ఇవిగాక పురాణోక్త మంత్రములు కూడ కలవు. పురాణ కథల చివర ఫలశ్రుతి యుండును. ఏ కథను పారాయణము చేసిన ఏమి ఫలితము కలుగునో తెలుపుచుండును. ఇప్పటికిని మంత్రములు ఫలించుచుండుటచేతనే అందరు తమ అవసర సమయము లందు మంత్రజ్ఞులను ఆశ్రయించుచున్నారు. ఇవిగాక పాము మంత్రము తేలు మంత్రము బెణుకు మంత్రము మొదలయినవి కూడా కలవు.

కొందరు ఈ మంత్రములు సరైన ఫలితములిచ్చుటలేదని చెప్పు చుందురు. వారి మాటలలో కొంత సత్యమున్నది. అయితే అందులకు కారణమును విచారించవలయును. అదియే ఇచ్చట ప్రధాన విషయము.

ప్రతిపని సక్రమముగా ఫలించుటకు ప్రధాన విషయములు మూడు ఉండును. ఉదాహరణకు మంచి పంట పండవలయునన్నచో మంచి విత్తనములు మంచి పొలము, శ్రద్ధగా చేయువారు అవసరము. ఇచ్చట కూడ మంత్రశక్తితోపాటు మంత్రమును జపించుచున్న వ్యక్తి ఉన్నతుడు కావలయును. అనగా దోషరహితుడు కావలయును. శారీరక మానసిక దోషములుండరాదు. అయితే అవి ఉన్నవి లేనివి ఎటుల తెలియును. ఆ దోషములు పోవుటకు ఉపాయమును శాస్త్రకారులిటుల చెప్పిరి. శారీరక దోషము పోవుటకు సంవత్సరమునకు ఒక పర్యాయమయినను కృచ్ఛ చాంద్రాయణవ్రతము చేయవలయును. మానసిక దోషములు పోవుటకు నదీతీరమున ప్రతిమాసమునందును సహస్ర గాయత్రీ జపము చేయవల యును. మనము విజ్ఞాన శాస్త్రవేత్తలకు కోరినంత ధనము నిచ్చి పరిశోధనలు చేయించుచున్నాము. అటులనే ఈ మంత్ర వేత్తలకు కూడా తగినంత ధనమునిచ్చి వారి పోషణ భారము వహించవలయును. రెండవ విషయము మంత్రమును స్పష్టముగ దోషరహితముగ ఉచ్ఛరించవలయును. కొందరు జపము చేయుట తేలికయందురు. కాని అది అతి కష్టము. ఎందులకన ఒకే అక్షరమును వేయిసారులు ఉచ్ఛరించవలయునన్నచో నాలుకకు నొప్పి కలుగును. నాలిక తడబడును. వేద పారాయణముకంటె కష్టము. జప ఫలమును కోరినవారికి జపముచేయువారిపై శ్రద్ధాసక్తులు ఉండవలయును. జపదేవత జడముకాదు. చైతన్యమూర్తి. తమపై భక్తిగలవారిని మాత్రమే దయతలచును. పసుపుతోచేసిన గణపతిని గణపతిగా భావించవలయునుగాని పసుపు ముద్దగా భావించరాదు. అటులనే జపముచేయువారిని జపదేవతగా భావించి అర్చించవలయునుగాని సామాన్యుడని భావించరాదు. అటుల భావించక పోవుటవలననే కొన్ని మంత్రములు ఫలించుటలేదు. సుందరకాండ

పారాయణముచేసిన వెంటనే ఫలితము గలుగును. పారాయణయము చేయువారిని తమయింటికి దయచేసిన హనుమంతునిగా భావించవలయును.

ఈ విధముగ చేసినప్పుడే మంత్రములు ఫలించునని గుర్తించ వలయును.

## 5. చదువుట మనపని - తెలుపుట దేవునిపని

మనకు ఎన్నో రకములయిన అనుభూతులు కలుగుతుంటాయి. వాటికి అనుకూలమయిన సాధనాలు వేరువేరుగా ఉంటాయి. మనం రుచికరమయిన భోజనం చేస్తాము. ఆనందం పొందుతాము. ఆ యనుభూతికి సాధనం నాలుక. అటులనే మనం సుందర దృశ్యంచూచి ఆనందిస్తాము. దానికి సాధనం నేత్రం. పుత్రపౌత్రులను ఆలింగనంచేసుకొని సంతోషిస్తాం. దానికి కారణం దేహ సంబంధమయిన చర్మం. అటులనే మంచి సంగీతం కూడా ఆనందాన్ని కలిగిస్తుంది. దానికి సాధనం శ్రవణేంద్రియం. ఈ విధంగా అనుభూతులు కలుగుతుంటాయి కదా. మనకు కలిగే జ్ఞాన సాధనం ఏమిటి. జ్ఞానం రెండు విధాలుగా ఉంటుంది. ఒకటి గురువు వలన, రెండవది తాను శ్రమించి సంపాదించిన సాధనం వలన.

గురువు తాను సంపాదించిన జ్ఞానమును శబ్దము ద్వారా మనకు బోధిస్తాడు. దానిని శ్రవణేంద్రియము ద్వారా విని మనసులో లేక బుద్ధిలో నిలుపుకొంటాము. అలా నిలచిన దానిని స్వానుభవములోనికి తెచ్చుకొని క్రొత్తదానిని వృద్ధిచేసుకుంటాము. ఇది మామూలుగా జరిగే క్రమం. మనము గ్రంథాలు చదివి అందలి విషయాలు తెలుసుకొని అందుచెప్పిన విషయముల ద్వారా అనుభూతిని పొందుతాము. ఈ యనుభూతిలో నాలుక, కన్ను, చర్మము, చెవులు కూడా పనిచేయవు. అయినప్పటికిని అనుభూతి కలుగుతుంది. దానికి కారణం శబ్ద సముదాయమే.

ఈ గ్రంథాలను రెండు విధాలుగా విభజించవచ్చు. ఒకటి మహా పురుషులవి. రెండు సామాన్యులవి. సామాన్యులు ఎల్లప్పుడు అందరి

యనుభవములోగల విషయాలను మాత్రమే వివరించగలరు. మహాత్ములు సామాన్యులకు అందని విషయాలను వివరించగలరు. కాబట్టి విశేష విషయాల నిమిత్తం మహాత్ముల గ్రంథాలను చదవాలి. చదివితే ఏమి అవుతుందనేది ప్రధానాంశము.

అవి చదివినపుడు అందలి విషయముల ద్వారా మనకు విశేష జ్ఞానము విశేషానుభూతి కలుగుతుంది. అది బుద్ధి వికాసానికి కారణమవుతుంది. ఇది మామూలు యనుభూతికంటె భిన్నమయినది.

ఎవరు ఎటువంటి గ్రంథాలు చదువుతుంటే వారు ఆ స్థాయిలోనే నిలుస్తారు. కొందరు కళాశాల ఉపాధ్యాయులు తెలివిగలవారయినా ఆ పరిధిని దాటలేరు. వారే విశ్వవిద్యాలయములో పనిచేస్తే క్రమంగా ఆ స్థాయికి చేరగలరు. అటులనే మనం చదివే గ్రంథాల ననుసరించి మన విజ్ఞానం పెరుగుతూ ఉంటుంది. మనం ప్రపంచ ప్రసిద్ధులయిన మహాత్ముల గ్రంథాలను చదువుతూవుంటే మనంకూడ మన చిన్న పరిధిని దాటి మహాత్ముల పరిధిలో ప్రవేశిస్తాము. అయితే ఏమవుతుంది. మనం మహాత్ములం అవుతామా అంటే ఆ విధమైన బుద్ధి వికాసం కలుగుతుంది.

మనం భగవత్సంబంధమయిన గ్రంథాలను చదివితే మనలో చదువుద్వారా భగవంతుని గుణగణాలతోపాటు భగవంతుడు ప్రవేశిస్తాడు. అంటే మనం భగవంతుని లక్షణాలు కలవారమవుతాము. మనమాట భగవంతుని మాట అవుతుంది. అంత తేలికగా అవుతారా అని సందేహం కలుగుతుంది. నిజమే. భగవంతుని శక్తియే ప్రవేశిస్తే తెలియనిది ఏమి ఉంటుంది. భగవంతుడే మనకు అన్నియు తెలియజెప్పుతాడు. మహాత్ముల గ్రంథాలు చదివితే దాని చివర ఫలశ్రుతి ఉంటుంది. అది చదివినపుడు ఆశ్చర్యము కలుగుతుంది. కేవలం చదువుటచేతనే ఇంత ఫలం కలుగు తుందా? మహాత్ములు చదివించుటకు అతిశయోక్తిగా చెప్పారా? అని అది అతిశయోక్తికాదు. నిజమే. ఇది క్రమసాధనలోగాని లభించదు. అది లభించినపుడు మనకు ఎవరిమీద కోపం రాదు. భార్యమీద, భర్తమీద,

కొడుకుమీద, పరులమీద కూడ కోపంరాదు. మనస్సు ప్రశాంతంగా ఉంటుంది. లోకసంబంధమయిన చికాకులు అంతగా బాధించవు. ఏ యాకర్షణ మనలను చెడు త్రోవకు త్రిప్పదు. అందలి విషయాలే మనలను పాశములవలె పట్టి బంధిస్తాయి. అట్టి గ్రంథ పఠనం లేకపోవుటచేతనే అందరు చపలచిత్తు లగుచున్నారు. సామాన్యుల గ్రంథాలు సామాన్య విషయాలనేగాని ఉన్నత విషయాలను చెప్పలేవు.

చదువుట మనపని తెలుపుట దేవునిపని అని గ్రహించాలి.

దేవీ అష్టోత్తరము చివర ఒక ఫలశ్రుతి ఇటులయున్నది.

*దేవీనామ సహస్రేషు పుణ్యమష్టోత్తరం శతం. యేనశ్రియమవాప్నోతి కోటి జన్మ దరిద్రతః* ఈ స్తోత్రము చదివినవారు దారిద్ర్యము నుండి విముక్తులగుదురు అని అందురు. ధనము కోసము ఆరాటపడుతున్న ఈ కాలములో ఈ అష్టోత్తరము చదువుట శ్రేష్ఠమయినది. దీనివలన ఫలితము కలుగుచున్నది. దీనిని ఉదయము స్నానము చేసి శుచియై చదువవచ్చును. పది నిముషములు మాత్రము పట్టును. దీనిని చదివి అందరు ఫలితము అనుభవింతురుగాక యని యాశించుచున్నాను.

## 6. సంభవామి యుగే యుగే

శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతయందు –

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్**

**ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే**

అని ప్రతిజ్ఞ చేసెనుగదా. ఆ భగవంతుడు ఈ కలియుగమున పుట్టునా? ఎప్పుడు పుట్టును? అని ధార్మికులయిన సత్పురుషుల హృదయములందు కలుగుచున్న ఆందోళన.

అందులకు సమాధానమే ఈ వ్యాసము.

ఈ శ్లోకమునందు మూడు విషయములున్నవి. అవి కార్యకారణ సంబంధము కలవి. ఒకదానితో మరియొకటి సంబంధమును కలిగియున్నది. భగవంతుని యవతారమునకు పరమ ప్రయోజనము ధర్మసంస్థాపన. అందులకు ఆయన జన్మించెదనని ప్రతిజ్ఞచేసెను. ఆ ధర్మము నిలువవలయు ననిచో ధర్మ ప్రవర్తకులయిన సత్పురుషులు జీవించవలయును. వారు జీవించవలయుననిచో వారిని బాధించు దుష్టులు నశించవలయును. అందులకే భగవంతుడు దుష్టులను శిక్షించెదనని చెప్పెను గాని వారిపై క్రోధముచేగాదు. శిష్టరక్షణ నిమిత్తమే. ఈ విధముగా నాలుగు పాదముల యర్థములు ఒక దానితో మరియొకటి పెనవేసుకొని యున్నవి.

బాగానే యున్నది. ఆయన ఎప్పుడు పుడతాడు అనే దానికి సమాధాన మేమి?

యుగే యుగే యనునది కాలవాచకము. మనము వారము నెల సంవత్సరము రోజు గంట నిముషము అని కాలమును కొలుచుచుందుము. అటులనే యుగే యుగే అనునది కూడా కాలవాచకము. అయితే ఈ శబ్దమును కృత, త్రేత అనువానితో గలిపిగాక ప్రతి సమయమునందును ఎల్లప్పుడును అని చెప్పినచో సామరస్యముగ నుండును. అనగా ధర్మరక్షణ నిమిత్తము ఎల్లప్పుడును పుట్టును. పుట్టుచున్నాడు అని సమన్వయము చేసుకొన వలయును. అయితే ఇపుడు పుట్టినాడా? యనగా ఎల్లప్పుడు పుట్టును అని సమాధానము.

అవతారము లన్నియు ఒకే రీతిలో ఉండవలయును అను నియమము లేదు. దశావతారములు ఒకే రీతిలో లేవు. కాబట్టి రాముని వలెను, కృష్ణుని వలెను పుట్టునని మనము ఊహించరాదు. ఆయన సహస్ర శీర్షాపురుషుడు అని వేదము చెప్పుచున్నది. అనగా వేలకొలది తలలు గలవాడు. కాబట్టి ఎప్పుడు ఎచ్చటనయినా పుట్టవచ్చును. ఇపుడు గూడ పుట్టి దుష్టులను శిక్షించి శిష్టులను రక్షించి ధర్మమును కాపాడుచునే యున్నాడు.

మనము కొందరిని మహాత్ములు అని పిలుచుచున్నాము. ఎందుచేత వారు సమాజమునకు మంచిని కల్గించు కొన్ని పనులు చేసియుండిరి. అట్టి

వారలో శ్రీ శంకరాచార్యులు రామానుజాచార్యులు మధ్వాచార్యులు, రామకృష్ణ పరమహంస, వివేకానంద ప్రసిద్ధులు. ప్రస్తుతము శంకర పీఠాధిపతులు శ్రీ త్రిదండి చిన నారాయణ జియ్యరువారు, గణపతి సచ్చిదానంద, చిన్మయా నంద సుందర చైతన్య మొదలగువారు కలరు. వీరందరు శ్రీకృష్ణ పరమాత్మ చెప్పిన విషయములనే ప్రచారముచేసి ధర్మసంస్థాపన చేయుచున్నారు. వీరందరిని పరమాత్మయొక్క అంశ సంభూతులుగ భావించవచ్చును. ప్రతి పనిని ప్రభువు చేయడు. తన సేవకులచేత చేయించును. అటులనే భగవంతుడు సత్పురుషులచేత తన కార్యము సిద్ధింపజేయును. ప్రస్తుతము తిరుమల తిరుపతి వేంకటేశ్వరస్వామి వేద రక్షకుడుగ నిలిచియున్నాడు.

అయితే దుష్టశిక్షణమాట ఏమిటి దేశములో అత్యాచారములు దొంగతనములు హత్యలు మొదలగు రాక్షసకృత్యములు జరుగుచున్నవిగదా? వారిని ఎవరు శిక్షించెదరు? ఆ మాట సత్యమే! దుష్టుల శిక్షణ ఏదో విధముగ జరుగుచునే యున్నవి. వాటిలో ప్రధానమయినవి యాక్సిడెంట్లు, భూకంపాలు, వరదలు, తుఫానులు, పిడుగులు మొదలయినవి కలవు. ఇవియన్నియు దుష్టశిక్షణ కార్యక్రమములే.

అయితే ఈ క్లిష్ట సమయమున సత్పురుషులు చేయతగిన పనియేమి? భగవంతుడు సత్పురుషులను అన్వేషించుచుండును. భగవంతుని ప్రేరణచే మీకు మార్గదర్శకులు దర్శనమిత్తురు. వారే అవతార పురుషులు. మనకు విద్యనేర్పిన గురువు శ్రీకృష్ణ పరమాత్మతో సమానుడు. గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః గురుః సాక్షాత్పరబ్రహ్మ తస్మైశ్రీ గురవేనమః శాస్త్రవచనము.

వ్యాస భాగవతమున ప్రహ్లాదుడు నరసింహస్వామిని ప్రార్థించిన ఈ శ్లోకముతో వ్యాసమును ముగింతును.

**ఓం నమో భగవతే తుభ్యం పురుషాయ మహాత్మనే**
**హరయేఽద్భుత సింహాయ బ్రహ్మణే పరమాత్మనే.**

# 7. దైవము కర్మఫలమును తప్పించునా?

మనము ప్రతిదినము మంచి చెడులకు సంబంధించిన పనులు చేయుచుందుము. దానికి తగిన ఫలితములు కలుగుచుండును. దానినే కర్మఫలము అందురు. వైదిక ధర్మమంతయు కర్మఫలము నాధారముగా చేసుకొని చెప్పబడినది. కర్మలకు తగిన ఫలము కలుగుననుటకు మన జీవనమే సాక్ష్యముగనున్నది. లోకమున అందరు తమకనుకూలమయిన పనులు చేసి దానికి తగిన ఫలములను పొందుచున్నారు.

కృషీవలుడు తనకు అనుకూలమయిన విత్తనములు పొలమున వేసి విత్తనములకు తగిన పంటను పండించుచున్నాడు. అటులనే వ్యాపారులు ఉద్యోగులుకూడ తమకు తగిన పనులు చేసి ఫలితములను పొందుచున్నారు. ఆ విధముగ సత్కర్మలు చేసినవారు సత్ఫలితములను దుష్కర్మలు చేసిన వారు దుష్ఫలితములను పొందుచున్నారు.

అదేవిధముగ పాపపుణ్య ఫలితములను గురించి శాస్త్రకారులు ధర్మశాస్త్రములతో వివరించియున్నారు. అందులో ఏ సత్కర్మ చేసిన ఏ సత్ఫలితము లభించును, ఏ దుష్కర్మ చేసిన ఏ దుష్ఫలితము కలుగును అను విషయములను వివరించియున్నారు. దుష్ఫలితములకు తగిన ప్రాయశ్చిత్తములను అటులనే శుభములు కలుగుటకు తగిన సత్కర్మలను చెప్పియున్నారు ప్రాచీనులు. ఆ విధముగ చేసి సత్ఫలితములను పొందిరి. ఈనాటి వారికి ఆ విషయములు తెలియవు. అయినప్పటికిని భగవంతుని యనుగ్రహముకోరి పూజలు జరుపుచుందురు.

అవశ్యమను భోక్తవ్యం ఫలం కర్మశుభాశుభం అని శాస్త్రవాక్యము గలదు. ఏది ఏమయినను కర్మఫలములను అనుభవించితీరవలయునని ఆ శ్లోక తాత్పర్యము కర్మఫలము అనుభవించుట అనేక విధములుగా నుండును.

ఎవరికయినను ధనమును దానము చేయుటయు కర్మఫలము అనుభవించుటయే యగును. అటులనే మనము నక్షత్ర గ్రహ జపములు చేయుచున్నాము.

సామాన్యులమయిన మనము నెలసరి జీతముతో ఎవని వద్దనయినను పనిచేసినచో ఆ యజమాని తగిన సమయమున మనకు రావలసినది యిచ్చును. ఈ యజమాని ఏమియు సత్పురుషుడుగాడు. ఈర్ష్యాసూయలు కామక్రోధములు గలవాడు. అయినప్పటికి మన సేవకు తగినది యిచ్చును.

భగవంతుడు సామాన్య మానవుల వంటివాడు కాడు. ఆయన తనకు సేవ చేసిన వానిని వ్యర్థపరచడు. తగిన విధమున దయ చూపించును. అందులకనియేగదా మనవారు అనాది కాలమునుండి భగవంతునిపేర ఎన్నియో గుళ్ళు గోపురములు కట్టి సేవించుచున్నారు.

భగవంతుడు ఘటనాఘటన సమర్థుడు. సర్వ స్వతంత్రుడుగాని మనవంటి అల్పజీవిగాడు. కాబట్టి భగవంతుని సేవవలన కష్టములుతొలగి సుఖములు కలుగునని భావించవలయును. ఆయన సేవ యనగా ఆయన నామము ఎల్లప్పుడు ఉచ్ఛరించుటయే.

ఈ క్రింది శ్లోకము ఆ విషయమునే చెప్పుచున్నది.

**హరే రామ హరే రామ రామ రామ హరే హరే**
**హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే**
**ఇతి షోడశకం నామ్నాం కలికల్మష నాశనమ్**
**నాతః పరతరోపాయో సర్వవేదేషు దృశ్యతే**

కలియుగమున తరించుటకు నామస్మరణము చేయుటకంటె మరియొక ఉపాయము లేదు.

## 8. ఆచరణ లేని శ్రవణము వ్యర్థమా?

సామాన్యులందరు మహాపురుషులు చెప్పిన ఉపన్యాసములు వినుటకు వెళ్ళుచుందురు. అటుల వెళ్ళలేనివారు వెళ్ళువారిని చూచి వీరందరు వినుచుందురేగాని యాచరించరు. దానివలన ప్రయోజనమేమి యని యాక్షేపింతురు. దానిని ఆధారము చేసుకొని నీతులు చెప్పువారేగాని ఆచరించువారు ఉండరు అని ఒక సూక్తిని గూడ చెప్పుదురు. ఇది వినిన వారి మనసులో ఇది నిజమేనా యని అనిపించుచుండును. అది నిజముగాదు. వినుటగూడ ఆచరణములో మొదటి భాగమని గ్రహించవలయును. మనము చదువు ప్రతి పురాణమునందును ఫలశ్రుతియుండును. అందులో వినినందు వలన కలుగు ఫలితము స్పష్టముగా చెప్పబడును. అది మహర్షుల వాక్యము గాని యల్పులది గాదు. అయితే శ్రవణము ఆచరణము ఎట్లు అగును అని విచారించుకొనవలయును.

వాల్మీకి మహర్షి రామాయణ పఠనము వలనకలుగు ఫలితమును గురించి యిటుల చెప్పెను :

**పఠన్ద్విజో వాగృషభత్వమీయాత్**
**స్యాత్ క్షత్రియో భూమి పతిత్వమీ యాత్**
**వణిగ్జనః పణ్యఫలత్వమీయాత్**
**జనశ్చశూద్రోఽపి మహత్వమీయాత్**

రామాయణమును చదివినచో బ్రాహ్మణునకు ఎద్దు రంకెవేసిన విధమున వాగ్వైభవము లభించును అని చెప్పెను. శ్లోకములు చదువుటవలన వాగ్వైభవము లభించవచ్చునుగాని రామాయణముచదువుట వలన క్షత్రియునకు రాజరికము ఎట్లు వచ్చును. రాజ్యము బాహుబలముచే సంపాదించ తగినదికదాయని సందేహము కలుగును. ప్రాచీన సంప్రదాయము ననుసరించి గ్రంథము చదువుట యనగా గ్రంథమునందు చెప్పబడిన భగవంతుని ధ్యానించుటయని యర్థము. సర్వత్రా వ్యాపించిన భగవంతుడు

నీవు చేసిన ప్రార్థనకు సంతసించి నీ కోరికను వరరూపమున అనుగ్రహించును. అందువలన క్షత్రియుడు రాజరికమును, వైశ్యుడు వ్యాపార లాభమును, శూద్రుడు ఔన్నత్యమును పొందుదురు అని చెప్పెను. పూర్వము మహర్షులు తపస్సులు చేసి భగవంతుని వలన వరములు పొందిరి. అనగా భగవద్ధ్యానము చేసి భగవంతుని సంతోషపరచి శక్తిని సంపాదించిరి.

కాబట్టి శ్రవణము చేయుటయనగా ఆచరించుటయే యనియు కొందరు అలసులు చెప్పిన విధమున శ్రవణము వ్యర్థము కాదనియు గుర్తించవలయును. ఒకవేళ శ్రవణము చేసినప్పటికిని సత్ప్రవర్తనలేనిచో అప్పుడును శ్రవణము వ్యర్థముగాదు. ఎందులకనగా శ్రవణము చేయగా చేయగా సత్ప్రవర్తన కలుగును. అందువలన శ్రవణము తప్పనిసరిగ చేసి తీరవలయును.

## 9. మానవులు పశుపక్ష్యాదులకంటె ఉన్నతులా?

సృష్టియందు ఎన్నియో జీవరాశులున్నవి. అన్నిటికంటెను మానవులే శ్రేష్ఠులని మహర్షులు మహాత్ములు శాస్త్ర వచనముల ద్వారా చెప్పియున్నారు. కన్నులకు కనబడుచున్న విషయములు మహాత్ములు చెప్పినమాట సత్యమేనాయను సందేహము కలిగించుచున్నది.

అందుకు కారణము. ఒక సత్యమును గ్రహించుటకు ప్రత్యక్షము అనుమానము శబ్దము ఉపమానము అనునవి ప్రమాణములు. అందరు అంగీకరించినది ప్రత్యక్ష ప్రమాణము. ఆ ప్రమాణము పశుపక్ష్యాదులే ఉన్నతులు అను భావనను కలిగించుచున్నది.

సృష్టియంతయు భగవంతుని యాజ్ఞననుసరించి క్రమపద్ధతిలో సంచరించుచున్నది. సూర్యచంద్రాది గ్రహములేగాక భూమిపై సంచరించు జంతుజాలమంతయు క్రమపద్ధతిలో జీవించుచున్నది. జలజంతువులు పక్షులు క్రూర మృగములు కూడా వాటి వాటి పరిధిలో జీవించుచున్నవి. మాంసాహారులు మాంసమును శాకాహారులు శాకములను తినుచు క్రమపద్ధతిలో

సాంసారిక జీవనము చేయుచున్నవి. వాటిలో కామము క్రోధము ఈర్ష్యాదులు కనిపించుటలేదు.

మానవుల విషయములో అంతులేని యాశ కనిపించుచున్నది. ద్రోహ బుద్ధితో పరస్పరము మోసము చేసుకొనుచున్నారు. అహంకారముతో ద్వేషించుచు హత్యలు, ఆత్మహత్యలు చేయుచున్నారు. ఇంతమాత్రమేగాక భగవంతుడిచ్చిన తెలివిని దుర్వినియోగపరచి ప్రకృతి విరుద్ధములయిన విషయములను విజ్ఞానశాస్త్రమనుపేరుతో సాధించుచున్నారు. వానివలన మానవజాతి సుఖమున కంటె ప్రమాదములనే ఎక్కువగా పొందుచున్నది. నూతన పరిశ్రమల వలన జలవాయు శబ్ద కాలుష్యములు ఏర్పడి ప్రజలందరు రోగగ్రస్తులై వైద్యశాలలో జీవించుచున్నారు. అందరూ గ్రుడ్డిగ దానిని అనుసరించుచున్నారు. నడుచుట ఆరోగ్యమని తెలిసియు వాహనములపై వెళ్ళుచున్నారు.

ఈ శాస్త్రజ్ఞులు ఇంతటితో తృప్తిపడక భయంకరమయిన అస్త్రములను తయారుచేసి భూమిపైగల జీవరాశిని నిర్మూలనము చేయుటకు యత్నించు చున్నారు.

ఈ విధములైన కృత్యములను పశుపక్ష్యాదులు చేయుటలేదుకదా? అయితే మహర్షులు మానవజాతిశ్రేష్ఠమని చెప్పుటకు కారణమేమి?

ఏబది సంవత్సరములకు పూర్వము మానవులు ధర్మాభిలాషులై యుండిరి. వారికి అబద్ధములాడుట, ఇతరులను మోసము చేయుట, పరుల ధనము నపహరించుట తెలియదు. ధర్మ సంపాదన పరోపకార చింతన దైవభక్తి జీవిత లక్ష్యముగా ఉండెను. అబద్ధమాడుట పాపమని భావించిరి. ఇతరుల ధనమును అపహరించుట దొంగతనమనిరి. ఎవరయిన తప్పు చేయుటకు ప్రయత్నించినప్పటికి ఇతరులు నిందించెదరని భయపడువారు. ఈనాడు ఆ భావన పోయినది. పత్రికల యందలి వార్తల వలన అందరికి, అందరు దుష్టులే యను భావన వ్యాపించినది. ఒకరిని చూచి మరియొకరు

చెడుటకు అలవాటుపడిరి. శిశు మాతృపితృభ్రాతృ హత్యలు పెరిగిపోయినవి. ఎవరికి తగిన శిక్షలు లేవు. ప్రభుత్వ భయములేదు. దీనికి కారణము చదివిన చదువు నీతి నిజాయితీని నేర్పుటలేదు. ఇంద్రియ లౌల్యమును పెంచుచున్నది. అందరు బరితెగించిపోయారు. సత్పురుషులకు సమాజమున స్థానము లేదు.

ఇన్ని కారణములచేత మానవులు పశుపక్ష్యాదుల కంటె శ్రేష్ఠులా యను సందేహము కలుగుచున్నది. ధర్మాభిలాష కలిగినప్పుడు మాత్రము మానవులు పశుపక్ష్యాదుల కంటె శ్రేష్ఠులగుదురు.

అయితే మనము చేయవలసినదేమి?

విలాసములను కొంచెము తగ్గించుకొనినచో డబ్బు కొరత యుండదు. కొంచెము శరీరశ్రమ చేసినచో ఆరోగ్యము పెరుగును.

మంచి పుస్తకములు చదివి మంచివారితో స్నేహము చేసినచో జీవిత పరమార్థము నెరవేరును. టి.వి. చూడకపోవుట జీవితమునకు మంచిది.

ఆర్షవాణి సభ్యులకు వాల్మీకి రామాయణము మూలము స్వల్పధరకు లభించును.

## 10. వ్యాస వాణి

వ్యాసమహర్షి పదునెనిమిది పురాణములలో వివరించిన విషయములన్నీ క్రోడీకరించి ఈ శ్లోకములో నిటుల చెప్పెను.

**వల్గు కార్యంపరిత్యజ్య సతతం ధర్మవాన్ భవేత్**
**దానం దమోదయాచేతి సారమే తత్త్రయంభువి**

ధర్మాచరణమునకు దానము ఇంద్రియ నిగ్రహము దయయనునవి సాధనములు అని చెప్పుచు దానము ధర్మాచరణములో భాగమని వివరించెను. ఈ మూడు విషయములనే ఇటుల వివరించెను. మానవజన్మ దైవయోగము చేత లభించునది. మాటిమాటికి గ్రామము క్షేత్రము ధనము గృహము శుభాశుభములు లభించవచ్చునుగాని మానవ జన్మ లభించదు. కాబట్టి ఈ శరీరముచేత ధర్మాచరణము చేయవలయును. ధర్మాచరణమువలన ధనము

**అభ్యస్య సర్వశాస్త్రాణి తత్త్వం జ్ఞాత్వాథ బుద్ధిమాన్**
**పలాలమివధాన్యార్థీ సర్వశాస్త్రాణి సంత్యజేత్.**

శాస్త్రములు చదివి జ్ఞాన సంపాదన చేసి వానిని విడువవలయును ధాన్యమును గ్రహించినవాడు బియ్యమును తీసుకొని పొట్టును విడిచిపెట్టును. ఆత్మజ్ఞానము భక్తియోగముచే లభించును. భక్తినామ స్మరణచే లభించును. హరియను నామస్మరణచే మోక్షము లభించును.

ఈ విషయములు మేము ప్రకటించిన వ్యాస దర్శనమున గలవు. కోరినవారికి ఆ గ్రంథము పంపగలము.

## 11. బ్రాహ్మణో మమ దైవతం

*దైవాధీనం జగత్సర్వం మంత్రా ధీనంతు దైవతం*
*తన్మంత్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణో మమదైవతం*

దీని సామాన్యార్థం. లోకమంతయు దేవుని యధీనములోనున్నది. ఆ మంత్రములు బ్రాహ్మణుని యధీనములో నున్నవి. అందువలన దైవమునకు మంత్రమునకు వారధివలెనున్న బ్రాహ్మణుడు నాకు దైవమువంటి వాడు.

మానవుడు ఎంతటి విజ్ఞానసంపన్నుడయినప్పటికిని లోక జీవనమునకు ఆధారభూతములయిన సూర్య చంద్రాది గ్రహములయొక్క నక్షత్ర రాశులయొక్క గమనాగమనములను మార్చలేడు. జీవలోకమంతయు వాటిపై ఆధారపడి యున్నది. అందువలన లోకము దైవాధీనము అని చెప్పబడినది.

మానవుని జీవన ప్రవర్తనమంతయు అతడు జన్మించినది మొదలు చివరివరకు గ్రహ నక్షత్ర ప్రభావములననుసరించి గడచును. ఆ గ్రహ నక్షత్రములు వాటి స్వభావముననుసరించి ప్రవర్తించును. దానివలన మానవుని జీవితములో సుఖదుఃఖములు కలుగుచుండును. వాటిని అనుకూలముగా చేసుకొనుటకు మంత్రములు ఏర్పడినవి.

దేవతల యనుగ్రహమును కోరుచు పూర్వకాలమున మహర్షులు

తపస్సు చేసిరి. తపస్సు అనగా దేవతలను స్తోత్రము చేయుటయే. మానవుల వలెనే దేవతలుగూడ స్తోత్రప్రియులు. తమ స్తోత్రము చేసినవారిపై దయతలచి వారి కష్టములను తొలగించి సుఖములను కలుగజేయుదురు. వారి స్తోత్రమునకు తగిన మంత్రములను వేదములు చెప్పినవి. వాటిని మనకు ఋషులు అందజేసిరి. ఇప్పటివరకు ఆ మంత్రములను బ్రాహ్మణులు గురువుల సముఖమున నేర్చుకొని మానవులకు అవసరమయిన శాంతిని, కుటుంబ సుఖమును అందజేయుచున్నారు.

అయితే ఈ రోజులలో ఆ మంత్రములపై విశ్వాసము లేనివారు వాటిని పరిహసించుచున్నారు. అయినప్పటికిని కష్టకాలమునందు ఏ చికిత్స చేతను తమకు వచ్చిన కష్టములు తొలగనప్పుడు బ్రాహ్మణుల నాశ్రయించి వారి ద్వారా జపతపములు చేయించుకొని సుఖమును పొందుచునే యున్నారు. అనగా గ్రహాది దేవతలు మంత్రములకు అధీనమయి యున్నవనియే తెలియుచున్నది.

అయితే పాశ్చాత్య విజ్ఞానము పెరిగిన ఈ రోజులలో సమాజమునకు వాటిపై శ్రద్ధ లేకపోవుటచేత బ్రాహ్మణుడు ఇతరుల వృత్తులను ఆశ్రయించు చున్నాడు. ఆ వృత్తులలో ఎక్కువ సంపాదన యుండునని వీరి వ్యామోహము. నిజమునకు కులవృత్తులయందు మాత్రమే గౌరవ మర్యాదలు సంపాదనయు కలవు.

ఇతర చదువుల వలన అధిక సంపాదన యుండుననునది భ్రాంతి మాత్రమే. ఎందులకన – ఆ చదువులలోను హెచ్చు తగ్గులు గలవు. అందరికి అన్ని చదువులు రావు. వచ్చినప్పటికిని సరియయిన ఉద్యోగము రాదు. అట్టి వారందరు నిరుద్యోగులై సంచరించుట మనము చూచుచున్నాము. వైదిక విద్య నేర్చినవారికి నిరుద్యోగ సమస్య లేదు. అంతియేగాక తమకు కష్టకాలమున అక్కరకు వచ్చిన బ్రాహ్మణుని అందరు సంతోషముతో సత్కరింతురు.

**గుర్తించవలసిన విషయము :** కష్టకాలమునందు అక్కరకు వచ్చు బ్రాహ్మణుని గౌరవాదరములతో సత్కరించవలసిన బాధ్యత సమాజముపై యున్నది. అటులనే తన యవసరము సమాజమునకు ఉన్నదని గుర్తించి బ్రాహ్మణుడు వైదిక విద్యలను చేతనయినంతవరకు నేర్చుకొని భగవదారాధన చేయవలయును. అప్పుడు సమాజమంతయు బ్రాహ్మణుని యవసరమును గుర్తించి వైద్యులను ఇతర వృత్తులవారిని గౌరవించినటులనే బ్రాహ్మణునిగూడ గౌరవించునను విషయమును బ్రాహ్మణ జాతి మరువరాదు.

బ్రాహ్మణులకు గౌరవము తగ్గినదని అచ్చటచ్చట వినిపించి నప్పటికిని ఆస్తికులైన వారందరు బ్రాహ్మణులను సత్కరించుచునే యున్నారు. అందువలననే బ్రాహ్మణుడు సమాజ రక్షణకు దైవమువంటి వాడు అని పై శ్లోకములో చెప్పబడినది.

ఈ వ్యాసము వ్రాయుటలోని తాత్పర్యము. బ్రాహ్మణుని గొప్ప తనమును తెలియజేయుటయేగాక సమాజమునకు బ్రాహ్మణుని యవసరము ఎల్లకాలములయందు ఉండును. కావున అతనిని సత్కరించి పూజించవలసిన యవసరము సమాజమునకు ఉన్నదని తెలియజేయుటయే ప్రధానము.

తపస్సువలననే సర్వము సాధ్యమగును. వేదమును నిత్యము చదువుటయే బ్రాహ్మణునికి తపస్సు. వేదాధ్యయనము చేయలేకపోయి నప్పటికిని వేదతుల్యమయిన రామాయణమును చదువుటవలన ఆత్మశక్తి పెరుగును. పాపములు నశించును.

ఆ కారణముచేతనే శ్రీ జ్ఞానకీ సేవా సమాజమువారు తాము ప్రకటించిన నాలుగు కాండల రామాయణమును మిక్కిలి స్వల్పమయిన వెలకు బ్రాహ్మణులకు అందచేయుచున్నారు. దానిని గ్రహించి పారాయణ చేయవలయును.

---